no. 265




# భూమిక

మహాశయులారా!

కొముదవల్లి కృష్ణామండలములోని భీమవరము తాలూకాలో నున్న చిన్నగ్రామము. గ్రామము చిన్నదైనను నందలి క్షత్రియులహృదయములు విశాలములగుటచే వారిలో గొండ ఉప్రమ [illegible] యను గ్రామకరణముగారితమ్ముడైన కీర్తిశేషుడు శ్రీచంద్ర[illegible] చిన్నమరాజుగారును సమాలోచనముచేసి గ్రామమందలి [illegible] పురుషబాలవృద్ధులకు భాషాభివృద్ధి దేశాభిమానము లోకజ్ఞాన[illegible] భక్తి మున్నగునవి గలిగించునట్టి యొక గ్రంథభాం[illegible] స్థాపింపవలయు నని సంకల్పించి యేమహాదేవినావ[illegible] యొక్కలి పవిత్రమై జగద్వ్యాప్తమై యున్నదో యేదేవి [illegible] ఖండమును బరిపాలించిన రాణులలో బ్రథమగణ్యయవె[illegible] మావిక్టోరియామహారాణిగారి వజ్రమండు జూబిలీమహోత్స[illegible] మున ననగా 1897 సం॥ము జూన్ నెల 22వ-తేదీని శ్రీశ[illegible] యాద్యనేకసంస్కరణములను [illegible] శతాధికగ్రంథర[illegible] నాంధ్రభాష నభివృద్ధిలోనికి [illegible] యాంధ్రదేశమున [illegible] ఖ్యాతి సమకూర్చిన బ్రహ్మశ్రీ, రావు బహద్దరు కందుకూరి [illegible] యెడల తమ కుగల కృతజ్ఞతను సూచించుటకై శ్రీవీరేశలింగకవిసమాజ'

మనుపేర నొకపఠనమందిరము స్థాపించి దాని కనుబంధముగ నొకగ్రంథభాండార మేర్పరచి దైవభక్తిని పురికొల్ప నందొక ప్రార్థనసమాజము నెలకొలిపి శ్రీపీఠికా పురాధీశ్వరులయొక్కయు శ్రీపోలవరము జమీందారుగారియొక్కయు సహాయమున "కృష్ణారావుమందిర" మని శ్రీపోలవరముజమీందారుగారి పేర నొక పెంకుటిమందిరమును నిర్మించి యెంతో శ్రద్ధతో బత్రికలను దెప్పించి చదువునట్లు గ్రామస్థులను బురికొల్పి పాటుపడుచున్నారు. ఈసమాజమునకు ఆగ్రామవాసులగు శ్రీ భూపతిరాజు తిరుపతిరాజుగారును, శ్రీ రామచంద్రరాజుగారును, నామిత్రుడును కోపల్లెనివాసియునగు శ్రీ కాళ్లకూరి నరసింహముగారును మూలపాత్రములని చెప్పవచ్చును. ఈశ్వరానుగ్రహముచేతను మహాపురుషుల యాశీర్వచనముచేతను పైముగ్వురప్రయత్నములచేతను నేటికి సమాజము సుస్థిర మైనది. మహాపట్టణములయందు సయితము గ్రంథభాండారములపేరైన వినబడనికాలమున . కాలవశమున నేడు నేలదున్నుకొని జీవించునట్టి రాచపుట్టతో నిండియున్న యొక పల్లియయందు గ్రంథ భాండారము బయలుదేఱుట మిక్కిలియక్కజము. దాని కొక్క పెంకుటిమందిరము నిర్మింపఁబడుటయు లేఖ్యారూఢమగుటయు నక్కజములలో

నక్షజము. ఇదియనేకసమాజములకు మార్గదర్శి యనుట యతిశయోక్తి గాదు. నేను భీమవరము తాలూకాలోని వీరవాసరగ్రామీణుడ నగుటచే నీసమాజాభ్యున్నతివిని మాతాలూకాలో నిట్టిది కలదు గదా యని గర్వించుచుందును. 1907సం॥ నవంబరు నెల 11-వ తేదిని రావుబహద్దరు కందుకూరి వీరేశలింగముపంతులుగారును 1908 వ సం॥ నవంబరు ౮-వ తేదిని నేనును నేతద్గ్రామమున కరిగి సమాజమును చూచి యభివృద్ధి విని మహానందభరితుల మైతిమి. ఇది సర్వవిధములచేత స్వసంరక్షణ చేసికొనదగినసమాజమగుటకు నైదువేలరూపాయలమూలధనము కావలయును. అందుపై నవచ్చువడ్డీ ప్రతిసం॥ము నూతనగ్రంథములంగొని గ్రామాంతరస్థులకుగూడ బంపి జ్ఞానమును వృద్ధిచేయవలయుననియు భాండాగారకుడు మున్నగువారికి వేతనములిచ్చుటకు, మందిరమునకు మరమ్మతులు చేయుటకు మొదలగుపనులక్రింద వినియోగింపబడును. ఈసత్కార్యమునకు ధనవంతులు, దేశాభిమానులు, జమీందారులు రాజులు తోడ్పడవలెననియు గ్రామగ్రామమున నిట్టిదొకటి నెలకొలిపి జ్ఞానాభివృద్ధి గావింపవలయునని యాంధ్రదేశీయులనందఱ గోరుచున్నాడను. మఱియు నీసమాజమాంధ్రదేశగ్రామసమాజములన్నిటికి మార్గదర్శియై విలసిల్లుగావుత !

రాజమహేంద్రవరము, చిలకమర్తి లక్ష్మీనరసింహము.

20—8—16.

కుముదవల్లి శ్రీవీరేశలింగకవిసమాజమునం దభిమాన

ముఖ్యులు.

1. శ్రీకొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావు
పంతులు బహద్దరు బి. యె. గారు.
జమీందారు, పోలవరము.

2. శ్రీరాజా రావు వెంకటకుమారమహీపతి
సూర్యారావు, బహద్దరుగారు.
జమీందారు, పిఠాపురము.

3. రావుబహద్దూరు శ్రీకందుకూరివీరేశలింగకవి
పంతులుగారు, రాజమహేంద్రవరము.

4. శ్రీచిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారు.
రాజమహేంద్రవరము.

5. శ్రీఅల్లూరి రామరాజుగారు, బి. యె.
ఆంధ్రదేశసేవక సాంఘికుఁడు,
మోగల్లు—భీమవరంతాలూకా.

---

బ్రహ్మానందస్వామి నిర్యాణము—ఈగ్రంథకర్త భీమవరము
తాలూకా కోపల్లె గ్రామనివాసు లగు
బ్రహ్మశ్రీ కాళ్ళకూరి నరసింహముగారు
చదువదగిన గ్రంథము. దీని వెల 2 అణాలు.

ఇది రాజమహేంద్రవరమున నున్న చింతామణి ప్రెస్సులో
దొరకును,

---

(రు. 15 లు స్టాంపు)

రు 3000 లు మూఁడువేలరూపాయిలకిమ్మతుగల ఆస్తికి

# డిక్లరేషన్ ఆఫ్ ట్రస్టు దస్తావేజు

---

ది 12-3-1916 సం॥రం తేదీని కృష్ణా డి॥ భీమవరం తాలూకా కుముదవల్లి కాపురస్తులు క్షత్రియులు, యీనాం దార్లు 1 భూపతిరాజు రామరాజుగారికుమారుడు వెంకటపతిరాజు 2 సాగి అప్పలరాజుగారికు॥ వెంకటనరశింహరాజు 3 భూపతిరాజు వెంకట్రాజుగారికు॥ తిరుపతిరాజు 4 భూపతిరాజు రామరాజుగారికు॥ బాపిరాజు 5 కోపెల్ల కాపురస్తులు, బ్రాహ్మణులు, యీనాందార్లు కాళ్లకూరి బుచ్చిరామయ్యగారికుమారుడు నరశింహ్వాముగార్లకు.

కృష్ణా డి॥ భీమవరంతాలూకా కుముదవల్లి కాపురస్తులు, క్షత్రియులు, యీనాందార్లు భూపతిరాజు వెంకట్రాజుగారి కుమారుడు తిరుపతిరాజు 2 భూపతిరాజురామరాజుగారి కుమారుడు బాపిరాజు, యిద్దరు యేకస్తులై వ్రాయించి యిచ్చినది.

కుముదవల్లి గ్రామకాపురస్థులై కీర్తిశేషులైన పం|డంగి చిన్నమరాజుగారియొక్కయు, నింకా మరికొందరియొక్కయు సహాయముతో, కృష్ణాజిల్లా, భీమవరంతాలూకా, కుముదవల్లి గ్రామములో, హిందూదేశమును తల్లివలె చల్లగ పాలించి, ఘనతవహించి, స్వర్గస్థురాలైన, శ్రీమద్విక్టోరియా మహారాణీ చక్రవర్తినీగారి డైమండుజుబ్లి మహోత్సవసందర్భమునుబట్టి, ప్రభుభక్తి విశ్వాసజ్ఞాపక చిహ్నముగ, క్రీస్తుశకము 1897 సం॥ రం॥ జూన్ నెల 22-వ తేదిరాత్రి సుమారు 7 ఘంటల వేళ సంఘ సంస్కారపారీణుడును, ఆంధ్రభాషా పోషకుడును, మానసిక యేకేశ్వరోపాసన మతావలంబకుడును అయి సుప్రసిద్ధిచెందిన బ్రహ్మశ్రీ రావుబహద్దూర్ కందుకూరి వీరేశలింగముపంతులువారియెడ గల భక్తి విశ్వాసములనుబట్టి ఆయన పేరు శాశ్వతపరచుటకై "శ్రీ వీరేశలింగకవి సమాజము" అను పేరుతో ఒకసమాజము స్థాపింపబడినది. యిటీవల ఆసమాజమునకు అయ్యేఖర్చులు మేమున్ను, మరికొందరున్ను, భరించుచున్నాము. సదరుసమాజముకొరకు భవననిర్మాణముకై మాలో భూపతిరాజు తిరుపతిరాజున్ను, కోపెల్లనివాసులు శ్రీకాళ్లకూరి నరశింహముగారున్ను ఇంకా మరికొందరున్ను ప్రథమమున కృషిచేసి కోరగా గోదావరిజిల్లా,పోలవరంజమీందారువారగు శ్రీరాజా కొచ్చెర్లకోట రామచంద్రవెంకటకృష్ణా

రావుపంతులు బహద్దర్ బి. యె. గారు కొంతసొమ్ము విరాళ మిచ్చి ప్రోత్సహించుటచే మరికొంతధనము స్వహస్తపరహస్త ములచే సమకూర్చి ఆ 1898 సం॥ రం॥ లో ఒకపూరియింటిని గట్టి ఆయేట ఆగష్టునెల 6-వ తేదీని అనగా విళంబినామసంవ వత్సరశ్రావణబ పంచమిస్థిరవాసరంవుదయము9న్నరఘడియల ప్పుడుఆగృహముననూతనప్రవేశముగావించియుండిరి.ఆయింటికి స్థలము గవర్నమెంటువారు నివేశ్నముగా యిచ్చియున్నారు. సదరు జమీందారువారి పేరు జ్ఞాపకముండుటకై ఆయింటికి "కే. ఆర్. వి. కృష్ణారావు మందిరము" అను పేరిడిరి. ఆ యింటిసంరక్షణకును దానిలో సమాజము శాశ్వతముగా జరుపుటకును కొంతసొమ్ము సమకూర్పబడినది. ఆభవనము నిలవరమైనదిగా వుండుటకు పెంకుటిల్లుగా చేయవలెనని కృషి చేయగా యిదివరకిచ్చినది గాక దానినే చేర్చి మరికొంత స్థలము తహశ్శీలుదారుగారు గ్రాంటుచేసి వెనుకటిది యిది యును కలిపి ప్లానుసహితము 1911 సంవత్సరములో నె. 35 రుగా నివేశనస్థలపుపట్టా యిప్పించినారు. పిమ్మట వెనుకటి పూరియిల్లు తీసివేసి పెంకుటిభవనము నిర్మించిరి. దానికొరకు పిఠాపురసంస్థానాధీశ్వరులగు శ్రీరాజా రావు వెంకటకుమార మహీపతి సూర్యారావుబహద్దూరువారును,శ్రీపోలవరంజమీం దారువారును, మరికొందరు సత్పురుషులున్ను ధర్మముగా

విరాళము లిచ్చియున్నారు. ఆభవనములో సదరు సమాజము వారు 1910 సం॥రం నవంబరునెల 5 వ తేదీని తిరిగి ప్రవేశము గావించిరి. సదరు సమాజమునకు పెక్కండ్రు కవులు, పండితులు మున్నగువారు అనేకగ్రంథములు ధర్మముగా నిచ్చియుండిరి. సదరు సమాజమువారు వీలైనప్పుడు నిరుపేదలగు అంగవైకల్యులకును, దిక్కుమాలిన బిడ్డలకును, అన్న, వస్త్ర దానములు చేయుటకుగాను మూలధనమువల్లవచ్చే వడ్డీనిమాత్రమే ఖర్చుపెట్టుచుండవలెననెడి షరతుతోను, మూలధనము అవుసరము కలిగినప్పుడు స్థిరరూపకమైన ఆస్థిగా చేయవచ్చునన్న షరతుతోను, యిద్దరుస్త్రీలు అనగా 1. కుముదవల్లి గ్రామనివాసి క్షత్రియ భూపతిరాజు విస్సంరాజుగారి కుమారుడు లేటు నరసింహరాజుగారిభార్య వెంకయ్యమ్మగారు, 21-1-1905 సం॥రం తేదీని రు 100 లున్ను, కోపెల్లగ్రామ నివాసియై గతించిన బ్రాహ్మణి శ్రీకాళ్ళకూరి నరశింహము, చినభోగరాజుగార్ల సోదరియు లేటు ద్రోణంరాజు పెదసోమరాజుగారి భార్యయు అయిన సీతమ్మగారు తన అవసానదశయందు ది. 31-10-1909 సం॥రం తేదీని రు 30 లున్ను ధర్మముగా యిచ్చియున్నారు. సదరు సమాజపోషణకై మూలధనముగానుంచిగాని లేక స్థిరాస్తిగాచేసిగాని వడ్డీగాని ఆస్తివల్లవచ్చే ఆదాయముగాని ఖర్చుపెట్టుచుండవలెననెడి షరతు

తో కంచుమర్తిగ్రామనివాసి క్షత్రియ లేటు పెన్మెత్స జగ్గ రాజుగారిభార్య సత్తెయ్యమ్మగారు ఆ 1903 సం॥రంలో రు 100 లు ధర్మముగా నిచ్చుటకు వాగ్దానముచేసి దరిమి లాను రు 50 లు వసూలు యిచ్చినారు. తక్కినవి యివ్వనై యున్నారు. యింకా కొందరు స్త్రీపురుషులు సహితము వారి వారి శక్త్యానుసారముగా కొంతధనము యిచ్చియున్నారు. మేమున్ను సదరు సమాజమునకు అపుడపుడు కొంతసహాయ ము చేయుచు, ఆసమాజములో మెంబర్లుగానుండి ది 6-1-16 సం॥రం తేదీని మూలధనముగా లేక అవసరమునుబట్టి స్థిరా స్తిరూపకముగా చేయుటకు వడ్డీని లేక ఆదాయమును మా త్రమే ఖర్చుపెట్టుచుండవలెననెడి షరతుతో రు 200 లున్ను యీదస్తావేజుకు ఖర్చులు వగైరాల నిమిత్తము మాలో బాపి రాజు ధర్మముగా నిచ్చియున్నాడు. పైనవ్రాసిన షరతుల తోనే ప్రార్థనాసమాజమునకుగాను కుముదవల్లిగ్రామనివాసి క్షత్రియ లేటు భూపతిరాజు కృష్ణంరాజుగారిభార్య శీతయ్య మ్మగారు దఫదఫాలుగా యిప్పటికి రు 100 లు ధర్మముగా నిచ్చియున్నారు. సదరు సొమ్ము కలుపుకొని మేమున్ను యిత రులున్ను యిచ్చిన ఆబాపతు మొత్తము సుమారు రు 600 లు నగదున్ను సుమారు రు 2000 లు విలువగల యిల్లున్ను స్థలము, గృహోపకరణములున్ను రమారమి రు 350 లు ఖరీదుచేసే

సుమారు 600 ల సంఖ్యగల గ్రంథములున్ను, రమారమి రు 50 లు ఖరీదుచేసే యితరపరికరములున్ను సదరు సమాజమునకు యిప్పటికి మొత్తము రు 3000 లు (మూడువేల రూపాయిలు ఖరీదుచేసేఆస్తి ట్రస్టుగా చేర్పబడియున్నది.యింకా కొందరు కొంతఆస్తిని నగదును ధర్మముగా యివ్వనై యున్నారు. యిటిస్థితిలో యీదిగువను వ్రాసిన పెద్యాలుదాఖలా ఆస్తిలోచేరిన సదరు కె. ఆర్. వి. కృష్ణారావు మందిరము అను పేరుగల భవనములో "శ్రీవీరేశలింగకవిసమాజము," అను పేరుగల సదరు సమాజమును, యీసమాజమున కను బంధముగా స్థాపించియున్న యేకేశ్వరమానసికారాధనగల ప్రార్థనాసమాజమును జరుపుటకున్ను యీక్రింద వివరించిన యితర వుద్దేశ్యములను నెరవేర్చుటకున్ను, సదరు సమాజమునకుగల ఆస్తిని పాలించి యింకా ట్రస్టుగా ఆస్తిని సంపాదించుటకును యుక్తముగా వ్యవహారము జరుపుటకును దొరతనమువారి చట్టములనుబట్టి తగిన యేర్పాట్లు చేయుట అవసరమై యున్నది. కనుక సదరు సమాజములతో విశేషసంబంధముగల మేము యీసమాజోద్దేశములను యుక్తముగా నెరవేర్చుటకై నిర్ణయించిన షరతులవివరం పైనచెప్పబడిన సమాజములు యీక్రిందివ్రాసిన మూడుసంఘములవారిచే పాలింపబడుచుండవలెను.

1. ట్రస్టుసంఘము.
2. కార్యనిర్వాహకసంఘము.
3. సాధారణసంఘము.

ఈసంఘములలో నెవరుండవలసినదిన్ని వారివిధులున్ను, వారిహక్కులున్ను వివరం.

I-(A) ఈసమాజమునందు అయిదుగురు సభ్యులుండవలెను.

(B) ఈక్రిందవ్రాసిన అయిదుగురు ట్రస్టీలుగా యేర్పరచడమైనది. కుముదవల్లిగ్రామ కాపురస్థులు.

1 భూపతిరాజు వెంకట్రాజుగారికు॥ తిరుపతిరాజుగారు.
2 భూపతిరాజు రామరాజుగారికు॥ బాపిరాజు.
3 భూపతిరాజురామరాజుగారికు॥ వెంకటపతిరాజుగారు
4 సాగి అప్పరాజుగారికు॥ వెంకటనరశింహరాజుగారు.
5 కాళ్లకూరి బుచ్చిరామయ్యగారికు॥ నరశింహ్వాముగారు. కోపల్లె.

(C) సదరు ట్రస్టీలు అయిదుసంవత్సరములకొకసారి సాధారణ సంఘ సభ్యులలోనుంచిగాని, కార్యనిర్వాహక సంఘసభ్యులలోనుంచిగాని, సాధారణసంఘ మెంబర్లలో మూడవవంతు మందికి తక్కువగాని సంఖ్యసభకూడి యెన్నుకొనుచుండవలెను.

(D) సదరు ట్రస్టీలసంఘములో నెవరైనను మరణిం చినను, చిత్తవైకల్యము కలిగినను, లేక దివాలా అయినను, బుద్ధి పూర్వకముగా లిఖితరూపకమైన రాజీనామాయిచ్చుట వల్లను, కాలీకాబడే ట్రస్టీస్థానము కాళీఅయిన తేదీ లగాయతు మూడుమాసములలోగా సాధారణసంఘసభవారివలన పైన పేర్కొనిన ప్రకారము నెన్నుకొనుచుండవలెను.

(E) సదరు అయిదుగురు ట్రస్టీలుగల సంఘమునకు మాలో తిరుపతిరాజుగారు కార్యదర్శిగాను తక్కినవారు మెం బర్లుగానువుండి వీరల అయిదుగురిలో యెక్కువమంది, చేసిన తీర్మానమును బట్టి వ్యవహారమంతయు జరిగించుచుండవలెను.

(F) ఇందులో జతపరచిన షెడ్యూలుదాఖలా అస్తి న్ని యికముందు సంపాదింపబోవు ఆస్తిన్ని, ట్రస్టీలసంఘ మందు పైనజెప్పిన సమాజములు జరుపుటకున్ను, యితర వుద్దేశ్యములు నెరవేర్చుటకున్ను ట్రస్టుగా సంక్రమించియుండ వలసినది.సమాజము పేరిట లేక సమాజముతరపున వ్రాయబ డే దస్తావేజులు ట్రస్టీల సంఘకార్యదర్శి వ్రాయుచుండవలెను.

(G) ట్రస్టీలు ట్రస్టు ఆస్తిని మూలధనమును వృద్ధిచే యుచు, కాపాడుచుండవలెను. సదరు సమాజముయొక్క ఆస్తి ని యేసహకారపరపతిసంఘములో నైనను, లేక నెవరికి గాని స్థిరాస్తి ప్రథమతాకట్టుమీద నైనను, బదులుయివ్వవ

చ్చును. ఒకచోట అభివృద్ధికొరకు వుంచబడిన ట్రస్టుసొమ్మును మరియొకచోటునకు పైన చెప్పినవిధముగా మార్చుటకు ట్రస్టీ సంఘమునకు అధికారము కలిగియున్నది.

II సదరు కార్యనిర్వాహక సంఘమువారు, సరిగా జమాఖర్చు లెఖలనువుంచి ప్రతియేటను తనిఖీ చేయించి ప్రతి సంవత్సరము జనవరి 15-వ తేదిలోగా రిపోర్టుసహితము సామాన్య సభలో బహిరంగముగా తెలియజేయుచుండవలెను. ట్రస్టీల సంఘమువారు వుంచిన లెఖలను ప్రతి డిశెంబరునెలాఖరులోగా రిపోర్టుతో కార్యనిర్వాహక సంఘమునకు అందింపవలెను.

III సదరు కృష్ణారావుమందిరమునందు శ్రీవీరేశలింగ కవిసమాజముయొక్క వుద్దేశ్యములు యీక్రింద వివరించినవిగా నియమించుచున్నాము.

1. ప్రజలకు అయికమత్యమును బలపరచి ఐహికాముష్మికవిద్యయు, నీతిని, సద్వర్తనమును, యేకేశ్వరమానసికారాధనమును సాధ్యమైనంతవరకు గలిగించి, మత, సాంఘిక, కులాచారసంస్కరణలను దెలిపి ప్రోత్సహించి, కృషి, వాణిజ్య, పరిశ్రామికాది దేశాభివృద్ధికరములగు అన్నివిషయములలోను, ఆసక్తి గలిగించి అభ్యసింపజేయుటకును,

2. సదరు సమాజములో గ్రంథములను, వార్తా

పత్రికలును చదివి, చదువురానివారలకు వీలైనంతవరకు విని పించుటయు, అవసరమైనప్పుడు సభలను జేసి సద్విషయము లను గురిం చి చర్చించి, వుపన్యసించి, యితరులచే వుపన్యాస ము లిప్పించుటయు, రాజశాసనవిరుద్ధములైన ఏసభలను జరు గకుండ జేయుటకును,

3. మానవసేవకును, దేశసేవకును అనుకూలమగు అన్నివిషయములను దెలిసికొని శక్తికొలది తోడ్పడుటకును,

4. స్త్రీలలో సద్విద్య వ్యాపించులాగున కృషి చే యుటకును, వారిపరిషత్తులలో తోడ్పడుటకును,

5. నిరుపేదలగు అంగవైకల్యులకు, దిక్కుమాలిన బిడ్డలకును, వీలైనప్పుడు ఆదాయమునుబట్టి యుక్తరీతిని, అన్న లేక వస్త్రదానములను చేయుటకును ప్రధానోద్దేశ్య ములుగా నుండవలెను.

IV శ్రీవీరేశలింగకవిసమాజమునందు పదునెనిమిది యేండ్లకు మించిన స్త్రీగాని, పురుషుడుగాని కార్యనిర్వాహక సంఘమువారిలో యెక్కువ సంఖ్యగలవారి అంగీకారము పొంది సమాజమువారు అప్పుడప్పుడు చేయు నిబంధనలకు లోబడి మెంబరుగా చేరవచ్చును. మెంబరుగా చేరుటకు కోరే యెవరికోరికనైనను కారణముచెప్పకనే కార్యనిర్వా హకసంఘమువారు నిరాకరించవచ్చును. మెంబర్లుగా చేర్పు

కోనబడినవారందరు, సదరు సమాజమునకు సాధారణసంఘ సభ్యులుగా పరిగణింపబడుదురు. మరిన్ని ట్రస్టీలు అయిన కారణమువల్లనే సాధారణసభలో సభ్యులగుదురు. సభ్యుల మొత్తములో మూడవవంతుమందికి తక్కువగాకుండా హాజరై యుండవలెను. దానినే క్వారమనవలసినది. ఆసభకు సాంఘికులు స్వయముగా గాని, ప్రాక్సీమూలముగా గాని యే మెంబరైనను తన అభిప్రాయమును తెలియజేయవచ్చును. ఈసాధారణ సభికులు తమలోనుండి తొమ్మండ్రకు మించకుండా జనవరినెల 15వ తేదిలోగా కార్యనిర్వాహక సంఘ మెంబర్లుగా యెన్నికకాబడవలెను, ఆయెన్నిక పబ్లికు మీటింగులో బ్యాలెట్టుమూలముగా జరుగుచుండవలెను. అట్టి వారిలో ఒక అగ్రాసనాధిపతి ఒక కార్యదర్శి ఒక ట్రెజరరు, ఒకభాండాగారకుడు, యీనలుగురు వుద్యోగీయులుగాను యెన్నిక కాబడవలెను. ఒకదఫాను యెన్నుకోనినవారి నెవరినైనను, యెన్నియేండ్లు యెందుకైనను యెన్నిక చేసుకోవచ్చును. యీతొమ్మండుగురిలో యేకారణమువల్లనైనను సంవత్సర మధ్యమున ఖాలీకలిగినయడల ఖాలీఅయిన తేది మొదలు ఒక నెలలో సదరు సమాజ మెంబర్లనుండి కార్యనిర్వాహక సంఘమువారు, ఆసంవత్సరముయొక్క చివరవరకు, తమసంఘపు ఖాళీని భర్తీచేసుకొనుచుండవలెను.

V ఈదిగువ షెడ్యూలు దాఖలానగదునుమార్చి స్థిరాస్తిగాచేయుటకుగాని తమకు దోచిన షరతులతో యెవరికైనాగాని లేక యేసహకారపరపతి సంఘమునకుగాని బదులిచ్చుటకున్ను విరాళములు, చందాలు, యితరవస్తుసామగ్రి ట్రస్టుగా సంపాదించుటకును, యిదివరకున్న చరాస్తిలో అవసరమునుబట్టి విక్రయించుటకున్ను, అన్నికోర్టులలోను, అన్ని ఆఫీసులలోను యావత్తు వ్యవహారచర్య జరుపుటకున్ను, షెడ్యూలులో వ్రాసినప్రకారము అన్నదానమునకులేక వస్త్రదానమునకున్ను యేర్పడ్డనగదును వృద్ధిచేయుట లేక దానితో స్థిరాస్థివల్లవచ్చే నభావల్లగాని ఆదానములు యుక్తరీతిని చేయుటకును పైనవ్రాసిన మందిరమును సంరక్షించి మార్చి వృద్ధిచేయుటకున్ను ట్రస్టీలకు అధికారము కలిగియుండవలసినది.

VI ట్రస్టీసంఘమువారు చేసే వ్యవహారము, వారిపనులు, వారిజమాఖర్చులున్ను కార్యనిర్వాహక సంఘమువారు పరిశీలించి చూచి న్యాయవిరుద్ధముగాను, నష్టమైనదిగాను కనబడినప్పుడు కార్యనిర్వాహక సంఘమువారి తీర్మానమునుబట్టి ఆక్షేపించి ఆవ్యవహారమును ఆపివేసి అట్లు ఆపినతేదిమొదలు నెలరోజులలోగా ఆయావిషయములు స్పష్టముగా మూడవవంతుమందికి తక్కువగాకుండా కూడిన సాధారణసంఘమువారికి

విశదపర్చవలసినది. వారుచర్చించి చేసినతీర్మానము ఆఖరుది గానుండవలసినది.

VII కార్యనిర్వాహక సంఘమువారు పైనచెప్పిన శ్రీవీరే శలింగకవి సమాజమునకును, ప్రార్థనా సమాజమునకును, సభ్యులను చేర్చుటయు వారువారు అప్పుడప్పుడు సందర్భముల లో చేసుకొను రూల్సునుబట్టి వ్యవహారమునడుపుట, చందా లు, విరాళములు, వసూళ్లుచేయుట, రాజ్యాంగమునకు గాని యితరసంఘములకుగాని తగువారికిగాని విజ్ఞాపనపత్రములర్పిం చుటకు ప్రతినిధుల నేర్పాటుచేయుట వుత్తర ప్రత్యుత్తరము లు జరుపుటవారి విధియైయున్నది. ట్రస్టీలసంఘమునకును ప్రా ర్థనాసమాజమునకును, జమాఖర్చు లెఖలువేరువేరుగా నుండ వచ్చునుగాని అన్నిటినిచేర్చిన లెఖగాకూర్చి దానినే సాధారణ సంఘ సభ్యుల సభలో విన్నవించవలసియున్నది. అన్నిసంఘ ముల నిలవసొమ్మున్ను, సంవత్సరాంతమున ట్రస్టు సంఘము వారికి వప్పగించవలసినది. దాని అభివృద్ధికివారు ప్రయత్నించు చుండవలెను. ఒకబాపతుక్రింద చేర్చబడిన సొమ్మునుగాని ఆస్తినిగాని మరియొకబాపతుక్రింద మార్చుటకు విశేష అవస రమున్ను, అవకాశమున్ను కలిగినప్పుడు శ్రీ వీరేశలింగకవి సమాజసాధారణ మెంబర్లలో అధిక సంఖ్యగల [illegible] ము ఆఖరుదిగానుండవలెను.



VIII ఈసమాజమునకున్న గ్రంధములను, వార్తాపత్రికలుమున్నగువాటిని యీసమాజసంబంధములేని యెవరైనను మందిరమున వుచితముగా చదువుకొన నిచ్చుటకును, లేక వారి వారియిండ్లకు గ్రంధములువగైరాలను తీసుకొనిపోనిచ్చుటకును, అవసరమైన విధులను కార్యనిర్వాహక సంఘమువారు చేయుచు, సాధారణ సంఘ సభ్యులచే స్థిరపరు పింపుచుండవలెను. మరియు పైనచెప్పిన ప్రకారను చదువుకొను సాంఘికులుగాని యితరులవల్ల యేపఠనమునకును, యెవరివల్లనుండి యేమిన్నీ రుసుముపుచ్చుకొనకూడదు.

IX సదరు కృష్ణారావుమందిరమున చుట్టలుకాల్చుట, చీట్లాడుట, వేశ్యలచే గీతనృత్యములుచేయించుట నీతి బాహ్యములగు ప్రతిమలనుగాని అట్టిగ్రంధములనుగాని నుంచుట, అట్టిప్రసంగములు జరుగుట యెంతమాత్రమును కూడదు. నీతి-భక్తి, జ్ఞానము వృద్ధిపొందులాగున పరోపకారము, దేశాభిమానము, కార్యనిర్వాహకశక్తి, అలవడునట్లు వుపన్యాసములు, హరికథలు, భజనలు, ప్రసిద్ధపురుషుల జీవితసంకీర్తనలు, యీశ్వరప్రార్థనలు జరిగించుచుండవలయును. గాని యీమందిరము పెండ్లివిడుదలకు గాని బాటసారులకు గాని యియ్యకూడదు.

X సదరు మందిరమున రాజ్యాంగసంబంధమగుసభలు

గాని, యితరవిధములగు సభలుగాని జరుపుకొనుటకు ట్రస్టు సంఘమువారు వారిరూల్సు ననుసరించి అంగీకరించుటకు లేక నిరాకరించుటకు అధికారము కలిగియున్నారు.

XI పైనవ్రాసిన నిబంధనలలో అప్పటప్పటికి కావలసి వచ్చు మార్పులను, సాధారణసంఘ సభ్యులలో మూడువంతు లమెంబర్లుకు తక్కువగాకుండా కూడిచేయవచ్చును.

ఆస్తియొక్క షెడ్యూలు.

1 కృష్ణాజిల్లా, భీమవరం సబురిజిస్ట్రారులో చేరిన కుముదవల్లిగ్రామంలో లోకల్ ఫండు చిన్నచెరువుకు వుత్తర ముగావున్నటువంటిన్ని గవర్నమెంటువారివల్ల గ్రాంటుచేయ బడినటువంటిన్ని నివేశన స్తలముకుహద్దులు. కొల్తలు. తూర్పు సర్కారు ఖాళీ స్తలం 60న్నర లింకులు,పడమరసందు వీధి 60న్నరలింకులు,వుత్తరంసర్కారుఖాలీస్తలం80న్నర లింకులు. దక్షిణం సర్కారుఖాళీస్తలం 34న్నరలింకులు.ఈహద్దులమధ్య 2087 చదరపులింకుల స్తలమున్ను. యిందులోవున్న కె.ఆర్. వి. కృష్ణారావుమందిరము అను పేరుగల పెంకుటిభవనము దీనికిచేరిన గృహోపకరణములన్నియు రమారమి కిమ్మతు రు 2000 లు.

2 ఛాయాపటములు, గడియారము మున్నగు చిల్లర సామగ్రి కిమ్మతు రు 50 లు.

3 యిప్పటికి 625 గ్రంథములు సుమారు వెల రు 350.

4 మూలధనము

| | |
|---|---|
| రు 130 లు అన్నము లేక వస్త్రదానములుతాలూకు మూలధనం | రు 600 |
| రు. 100 లు పార్థనసమాజముతాలూకు మూలధనం | |
| రు 370 లు శ్రీవీరేశలింగకవిసమాజముతాలూకు మూలధనం | |

వెరశి ఆస్తిమొత్తం కి 3000 మూడువేలరూపాయిలు

ఈపైవిధముగా యేర్పడిన నిబంధనలకు లోబడి శ్రీవీరేశలింగకవిసమాజమువారు ది 26-1-1916 సం॥రం శేసని కూడిన 4వ ప్రొసీడింగ్సు 3వ (రిజల్యూషను) తీర్మానము ప్రకారము యీట్రస్టు ఆస్తియు, యికముందు దీనికి చేర్చబడే ఆస్తియు ఆచంద్రార్కముగా జనోపయోగమగునటుల జరుగగలందులకు మామనస్ఫూర్తిగా వ్రాసియిచ్చిన డిక్లరేషన్ ఆఫ్ ట్రస్టుదస్తావేజు.

భూపతిరాజు తిరుపతిరాజువ్రాలు.

భూపతిరాజు బాపిరాజువ్రాలు.

ఇందుకుసాక్షులు.

1 భూపతిరాజు రామచంద్రరాజువ్రాలు.

2 భూపతిరాజు నారాయణరాజుసాక్షివ్రాలు.

3 సాగి సుబ్బరాజుసాక్షివ్రాలు.

దస్తూరీ—భూపతిరాజు బాపిరాజుస్వహస్తము

# సరియైన నకలు.

No. 2545 — భూపతిరాజు తిరుపతిరాజుగారు

పదిహేనురూపాయలు. — సా॥ కుముదవల్లి.

ది॥ 11-3-16 భీమవరం, ఆడివి

పిచ్చయ్య స్టాంపులెండరు.

1916 మార్చి 13 పగలు 2-3 ఘంటలమధ్యను భీమవరం సబురిజష్ట్రారు ఆఫీసులో దాఖలుచేసినది.

భూపతిరాజు తిరుపతిరాజు వ్రాలు

వ్రాసియిచ్చినట్లు వప్పకున్నది.

భూపతిరాజు తిరుపతిరాజు వ్రాలు. తండ్రి వెంకట్రాజుగారు క్షత్రియులు. యినాందార్లు. సా॥ కుముదవల్లి.

భూపతిరాజు బాపిరాజు, తండ్రి రామరాజుగారు క్షత్రియులు. యినాందార్లు కుముదవల్లి

బొటనవ్రేలి ముద్ర. [illegible]

నిరూపించినది—

భూపతిరాజు రామచంద్రరాజు తండ్రి చిన్నరశింహస్వామి రాజు క్షత్రియులు యీనాందారు కుముదవల్లి.

భూపతిరాజు నారాయణరాజు, తండ్రి జగన్నాధరాజు క్షత్రియులు. డిటో.

T. APPALANARASAYYA,
*Sub-registrar.*

1916 మార్చి 13.

4 పుస్తకం. 33 వాల్యూం 23 లగాయితు 31 పుటలు 1916 సం॥ నెం 654 రుగా రిజిష్టరు చాయబడినది.

చెల్లించిన రుసుము రు. 7-0-0.

1916 మార్చి 13.



T. APPALANARASAYYA,

*Sub-registrar.*

(సరియైన నకలు)



ట్రస్టు సంఘము.

1. కాళ్లకూరి నరశింహముగారు
2. భూపతిరాజు వెంకటపతిరాజుగారు.
3. సాగి వెంకటనరశింహరాజుగారు.
4. భూ॥ బాపిరాజుగారు.
5. భూ॥ తిరుపతిరాజుగారు కార్యదర్శి.

భీమవరంతాలూకా కుముదవల్లి శ్రీ
వీరేశలింగకవి సమాజముయొక్క

## నిబంధనలు.

1 సమాజమునామము—ఇహలోకప్రసిద్ధికలిగి పరలోకనివాసి యైన శ్రీమద్విక్టోరియామహారాణీ చక్రవర్తినీగారి డయిమండుజ్యూబ్లి మహోత్సవసందర్భమును బట్టి 1897 సం॥రం జూ౯ నెల 22-తేదిని దేశోపకారధురీణుడును, ఆంధ్రభాషాపోషకుడును, సంఘసంస్కర్తయు, గార్యనిర్వాహక దీక్షాపరుడును, ఆంధ్రదేశోద్ధారకప్రముఖుడును నై విలసిల్లుచుండు బ్రహ్మశ్రీ రావుబహద్దూరు శ్రీకందుకూరివీరేశలింగముపంతులు వారియందు గలఘనమగు భక్తివిశ్వాసములను బట్టి యీసమాజమున కీనామ మొసగబడినది. కావున దీనిని ,, కుముద

వల్లి శ్రీవీరేశలింగకవిసమాజము” అను పేరుతో వ్యవహరింప బడవలెను.

2 మందిరనామము-భీమవరం తాలూకా వీరవాసరం గ్రామము పూర్వపుటునికిపట్టయి దత్తతచే గోదావరిజిల్లాలోని పోలవరంయస్టేటునకు జమీన్దారయిన శ్రీరాజా కొచ్చర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావుపంతులు బి. ఏ. బహద్దూర్ వారు మందిర నిర్మాణమునకు మొట్టమొదట కొంచెము ధనసహాయము చేసి అధిక ప్రోత్సాహ మిచ్చుటచే సమాజకులు స్వశక్తిని నొకపూరియింటిని గట్టుకొని దానిలో ఆ 1898 సం॥ రం ఆగస్టునెల 6-వ తేదికి సరియగు విళంబినామ సంవత్సర శ్రావణబహుళ పంచమీస్థిరవాసర ముదయము ఘ 9 న్నర ఉత్తరాభాద్రనక్షత్రయుక్త కన్యాలగ్నమందు నీగ్రామవాసియు సమాజాభిమానియు నగు శ్రీసాగి నారాయణరాజుగారి యాజమాన్యమున సమాజకులచే నూతనప్రవేశము గావింపబడినది. పట్టపరీక్షాధురంధరులై, ఆంధ్రభాషాపోషకులై, సామాన్యజనులయెడలను సదా యాదరణను చూపు సుస్వభావముగల శ్రీజమీన్దారువారియందు గల కృతజ్ఞతనుబట్టి ఆయన పేరు శాశ్వతముగా నుండుటకై యీ మందిరమునకు “కే. ఆర్. వి. కృష్ణారావుమందిరము” అనునామకరణము చేయబడినది. పిమ్మట ఆయింటికప్పు తీసి

వేసి యింకను కొంతస్థలము దొరతనమువారివలన సంపాదించి పెంపుచేసి సమాజకులస్వసహాయమువలనను శ్రీపోలవరం జమీన్దారువారి సహాయమువలనను నితరులతోడ్పాటువలనను శ్రీ పిఠాపురసంస్థానాధీశ్వరులొసగిన విరాళమువల్లను ఆ 1910 సం॥ రమున ఆయింటిని పెంకుటి భవనముగా చేసి దానిలో ఆసం॥ రం॥ నవంబరునెల 5-వ తేదీకి సరియైన సాధారణనామసంవత్సర కార్తీకశుద్ధతృతీయాస్థిరవాసరమున పునః ప్రవేశముగావింపబడినది. కావున దీని నట్లేవ్యవహరింపబడవలసినది. ఇది ప్రతిదినముదయము గ 8 లు మొదలు రాత్రి గ 9 లువరకు తెరువబడి యుండును.

3 సమాజోద్దేశములు-(1) ఆంధ్రభాషాభివృద్ధికొరకు చేతనయినంతవరకు కృషిచేయుటయు, గ్రంధములను వీలయినంతవరకు సంపాదించుటయు, కరపత్రములను, వార్తాపత్రికలను దెప్పించుటయు, అన్నిటిని జదివి చదువురానివారికి వినిపించి తెలుపుటయు, భూగోళమును దెలుపుమ్యాపులను, గ్లోబు మొదలగు నుపకరణములను దెప్పించియు, మ్యాజిక్ లాంతరు మున్నగువాటిమూలముననుగూడ జనసామాన్యమునకు లోకజ్ఞానమును, నీతిని, సద్వర్తనమును, రాజభక్తిని ఆముష్మికభక్తిని గలిగించి యీశ్వరమానసికారాధన యలవడునట్లు కృషిచేయుటయు దేశాభివృద్ధికరము లగుప్రతివిషయములోను శక్తికొలది పరిజ్ఞానము కలిగించుకొని ప్రజలకు

తెలిపి యుచితరీతిని తోడ్పడుటయు,

(2) గ్రంథములు మున్నగువాటి నీసమాజమంది రమునకు వచ్చువా రందరును నేరుసుము నియ్యనక్కరలేక యే చదువుకొననిచ్చుటయు,

(3) గ్రంథములు మున్నగువాటిని స్త్రీలుసహిత ముచితముగా చదువుకొనులాగున ప్రోత్సహించుటయు, వాటిని వీలునుబట్టి వారివారియిండ్లకు పంపి తిరిగి తెప్పించుకొనుటయు,

(4) బాలబాలికల విద్యాభివృద్ధికి ప్రోత్సాహకరముగా నుండులాగున నప్పుడప్పుడు వారిని పరీక్షించి శక్తికొలది వారికి బహుమతు లొసగుటయు,

(5) ఇట్టిసమాజములను, పుస్తకాలయములను, పరపతిసంఘములను గ్రామములలో స్థాపించుటకు శక్తికొలది కృషిచేయుటయు, ప్రధానోద్దేశ్యము లయియున్నవి.

4 సమాజమెంబర్లు—(1) ఈసమాజోద్దేశ్యములను బాగుగా గ్రహించి ఆచరణకు నానక్తితో నుండి యెచ్చట నివశించి యేవృత్తికలిగి పదునెనిమిదియేండ్లకు పైబడినయేపురుషుడైనను, యేస్త్రీయైనను చిత్తవైకల్యములేక యీ సమాజములో నిదివరకున్న యిద్దరిమెంబర్లచే పేర్కొనబడి కార్యనిర్వాహకసంఘమువారు కూడినసభలో నధికసంఖ్య

వలన నంగీకరింపబడినవారు మెంబర్లుగా జేర్చుకొనబడుదురు. అట్లు చేర్చుకొనబడుటకుగాని, కారణముచెప్పకయే నిరాకరించుటకుగాని ఆసంఘమున కధికారము గలదు. అట్లు చేర్చుకొనబడినప్రతివారు నీసమాజమునకు సాధారణసంఘసభ్యులుగా పరిగణింపబడుదురు.

(2) ప్రతిమెంబరు ప్రతియేటను నొకరూపాయకు తక్కువకాకుండ మెంబరుగాచేరిన నెలరోజులలోగా చందాసొమ్ము చెల్లించవలయును. మెంబరుగా నుండుటకు తన కిష్టము లేనిచో వ్రాతమూల మిచ్చిగాని, లేక ప్రసిడెంటు, లేక కార్యదర్శితో వాగ్రూపముగా చెప్పిగాని మానుకొనవచ్చును. ఏకారణమువల్ల నయినను, ఆమెంబరుయొక్క ప్రవర్తన తమసంఘమున కనిష్టదాయకముగా నున్నదని తోచినప్పుడు కారణమును వివరించకయే కార్యనిర్వాహకసంఘము వారు ఆమెంబరును ఎప్పుడయినను తమసంఘమునుండి తొలగించుట కధికారము గలదు. అట్లు జరిగినప్పుడు డిశంబరు ఆఖరుతో అంత్యమయ్యే సంవత్సరమున కియ్యవలసిన చందా మొత్తము రాబట్టుకొనుటకు కార్యనిర్వాహకసంఘము అధికారము కలిగి యున్నది.

(3) సమాజమున కేమెంబ రయినను నొక్కసారిగా రు 15 లుకు తక్కువ కాకుండ మొత్తముగా చందా యిచ్చినపక్షమున నీసమాజవిధుల ననుసరించి మెంబరుగా నున్నంతకాలము ప్రతిసంవత్సరము చందాయివ్వవలసినవిధి లేదు. తాను మెంబరుగానుండుట మానుకొన్నను, లేక తొలగించినను దా నిచ్చినసొమ్ములో నెన్నడయినను, నేవిధముగానయినను, నేమాత్రమైనను తిరిగి యామెంబరుకు ముదరా యివ్వబడనేరదు. వరుసగా రెండేండ్లు తా నియ్యవలసిన చందాధనము వసూ లివ్వనిమెంబరు సంఘమునుండి తొలగింపబడును.

(4) ఈసమాజట్రస్టీలు సమాజమెంబర్లుగా పరిగణింపబడుదురు. ఎవరినిగాని ప్రతియేట నీసమాజమునకు చందా యివ్వనక్కరలేకుండనే గౌరవసభ్యులనుగా జేర్చుకొనుటకు కార్యనిర్వాహకసంఘమున కధికారము గలదు.

5 కార్యనిర్వాహకసంఘము—(1) ఈసమాజమెంబర్లలో మొత్తపుసంఖ్య మూడవవంతుకు తక్కువగాకుండ కూడినసభకు క్వారమ మనవలసినది. అట్లు కూడినసభికులు స్వయముగా గాని ప్రాక్సీమూలముగా గాని యేమెంబ రయినను తన యభిప్రాయమును తెలియజేయవచ్చును. అట్లు ప్రతిసంవత్సరము జనవరినెల 15 వ తేదీలోగా సభకూడి తమలో

నుండి 9 గురుకు మించకుండ కార్యనిర్వాహకసంఘమెంబర్ల ను ఎన్నుకోవలెను. అవసరమని తోచినపక్షమున ఆయెన్నిక పబ్లికుమీటింగులో బ్యాలెట్ మూలముగా జరుగుచుండవలెను. అట్లేర్పడిన కార్యనిర్వాహకసంఘములోనుండి యొక అగ్రాసనాధిపతిని, నొక కార్యదర్శిని, కోశాధిపతిని, భాండాగారకుని నిట్లు నలుగురిని నుద్యోగీయులుగా నప్పుడే యెన్నిక చేసికోవలెను. ఒకదఫా నెన్నుకొనినవారి నెవరిసయినను యెన్ని యేండ్లిందుకయినను నెన్నిక చేసికోవచ్చును.

ఈ 9 గురిలో నేకారణమువల్లనయినను సంవత్సర మధ్యమున ఖాళీకలిగినయెడల ఖాళీయయిన తేదీమొదలు లొక నెలలోగా సాధారణసభ్యులలోనుండి యాఖాళీని కార్యనిర్వాహకసంఘమువా రాసంవత్సరాంతమువరకు భర్తీచేసుకొనుచుండవలెను.

(2) అవసరమయినగ్రంథములు పత్రికలు, నితర సామానులు మున్నగువానిని కొనిగాని లేక యుచితముగా గాని సంపాదించుటయు వాటిలో ననవసరమని తోచినవాటిని విక్రయించుట, సమాజమందిరమును నితరసామానులను మరమ్మతుచేయించుటయు, అభివృద్ధిచేయుటయు, చరస్థిరాస్తుల సంపాదించుటయు, దానిని ఫలపరుచుటయు, మున్నగు విషయములలో కార్యనిర్వాహకసంఘమువారు చేసినతీర్మా

నమును ట్రస్టీసంఘమునకు తెలియపర్చుచుండవలెను. ట్రస్టీలు చేసేవ్యవహారము అక్రమమయినదిగాను నష్టదాయకముగాను నున్నదని తోచినప్పుడావ్యవహారమును ఆపివేసి, ఆపిన తేదీమొదలుకొని నెలరోజులలోగా సాధారణసంఘమెంబర్లలో మూడవవంతుకు తక్కువకానిసంఖ్య చేర్చి ఆయావిషయము స్పష్టముగా విశదీకరించవలసినది. పిమ్మట వారు చర్చించి చేసిన తీర్మానము ఆఖరుదిగానుండవలసినది

(3) సమాజమునకు మెంబర్లను చేర్చుట, చేరినవారిలో వారివారిఅనుమతిప్రకారము ప్రార్థనాసమాజములో మెంబర్లనుగా జేస్చుట రెండుసమాజములయొక్క జమాఖర్చు లెక్కలు వేరువేరుగా నుంచుట రెంటియొక్క ఆదాయవ్యయములును, వృద్ధిక్షయములును, తెలియులాగున సంవత్సరాంతమున నేకముఖముగా నుండురిపోర్టును తయారుచేసి కార్యనిర్వాహకసంఘమువారు ఆసంవత్సరాంతమున సాధారణసభ్యులయెదుట చదివి వారిరిమార్కులతో రికార్డుచేయుచుండవలెను. నిలవసొమ్మును ట్రస్టీలసంఘమునకు చేర్చవలయును.

(4) చందాలు, విరాళములు వసూలుచేయుటయు రాజ్యాంగమునకుగాని యితరసంఘములకుగాని తగువారికిగాని, విజ్ఞాపనపత్రము నర్పించుటకును, ప్రతినిధులయేర్పాటుచేయుటకును, కార్యనిర్వాహకసంఘమునకు విధియయిన పనిగా నున్నది.

(5) అధ్యక్షుడు-సమాజమును పరిపాలించుచు కార్య నిర్వాహకసంఘమువారు చేయుతీర్మానములను బట్టి కార్యద ర్శిచేయుచున్నవ్యవహారము చూచుచు లెక్కలను తనిఖీచే యుచు లోపములను కనిపెట్టి వాటిని సవరించుట కవసర మయినప్పుడెల్లను కార్యదర్శిద్వారాగాని స్వయముగా గాని కార్యనిర్వాహకసంఘమును లేక, సాధారణసంఘమును గూర్చు చు గ్రంథములను, గ్రంథభాండాగారకుడు చేయుచున్నపనిని, ఇతరసామగ్రిని, అధ్యక్షుడు తరుచుగా, తనిఖీచేసి తేదీతో చేవ్రాలుచేయుచుండవలెను. మరియు సమాజమున కవస రమయినసేవకులను నియమించుటకు తొలగించుటకు నధ్యక్షు న కధికారము కలదు. ఆవిషయములో నక్రమము కలిగినయె డల కార్యనిర్వాహకసంఘమువారికి విన్నవించుకొనవచ్చును. వారు సవరించుటకుగాని, రద్దుపరచుటకుగాని, స్థిరపరచుటకు గాని అధికారము కలిగియున్నారు. వారు చేసినతీర్మానము కూడ క్రమమయినదిగా లేదని తోచినపక్షమున నాసేవకుడు సాధారణసభ్యులు కూడినప్పుడు వారికి నివేదించుకొనవచ్చును. వారితీర్మానము అఖరుదిగా నుండవలయును.

(6) కార్యదర్శి - సమాజాభివృద్ధికి సదా పాటుపడు చు నుత్తరప్రత్యుత్తరములు జరుపుచు నగత్య మయినప్పు డె ల్లను సభలను కూర్చుచు నాయాతీర్మానములను లెఖ్ఖలను

నిందుతో సంబంధించినయావత్తురికార్డును జాగ్రత్త పెట్టుచు సేవకులచే నాయాపనులు చేయించుచు సమాజసొమ్ములోనుంచి యవసరమును బట్టి సమాజఖర్చులకు గాను నేతీర్మానమును నక్కరలేకయే రు5-0-0లు ఖర్చుపెట్టుకొనుచు, చందాలు వగైరాలు వసూలుచేయుచు నానిల్వసొమ్ము కోశాధిపతి కొప్పగింత పెట్టుచు,గ్రంథములను నితరసామగ్రిని కూడ కాపాడుచు వాటివృత్తాంతమును వార్షికచరిత్రలో వ్రాసి సంవత్సరోత్సవమునకు 15దినములకు ముందు కార్యనిర్వాహకసంఘమువారివలన నంగీకరింపజేసి దానిని సంవత్సరాంతపుసభలో నివేదింపవలయును.

(7) కోశాధిపతి—తనకు కార్యదర్శిగాని ప్రసిడెంటుగాని యిచ్చెడుసొమ్మును పుచ్చుకొని లెఖ్ఖయుంచికార్యనిర్వాహకసంఘమువారితీర్మానము ననుసరించి వారిరుపురలో నెవరెంతసొమ్ము కోరినను ఇచ్చుచు ఓొచర్లుసహితము లెక్కలుంచవలయును. మరియు ప్రతిసంవత్సరాంతమున సభజరుగుతేదీకిపూర్వము వారముదినములలోగా జమాఖర్చులెఖ్ఖతో నిల్వసొమ్ము కార్యదర్శికి వప్పగించవలయును.

(8) భాండాగారకుడు-పుస్తకములు జాబితాసహితముగగ్రంథములు మున్నగున వన్నియు జాగ్రత్తపెట్టి ప్రతిదినము మందిరమునకు వచ్చుచదువరులకిచ్చుచుపుచ్చుకొనుచు

పాఠకులసంఖ్య పెంపొందులాగున ప్రోత్సాహపరచుచు యే రోజున నేవ క్రొత్తగ్రంథమును, లేక యేవార్తాపత్రికను చదివిన దిని, మెంబర్లు గాని, స్త్రీలు గాని వారువారు కోరినగ్రంథములు మున్నగువాటిని వారియిండ్లకు పంపుచు తెప్పించుచు కొనుచు వివరముగా దెలియులాగున రిజస్టర్లు సరిగా నుంచవలసినది. ఇండ్లకు తీసికొని వెళ్లినపుస్తకములు మున్నగునవి పోగొట్టిన లేక పాడు చేసినను, అట్టిమెంబరువద్ద గాని స్త్రీవద్ద గాని ఆఖరీదుకు రెట్టింపుసొమ్ము వసూలు చేసికొనుటకు యీసమాజమున కధికారము కలదు.

(9) గ్రంథములు పత్రికలు--ఏ మెంబరయినను పుస్తకములను పత్రికలను నింటికి తీసికొని పోగోరినప్పుడు ఆరిజస్టరుపయి చేవ్రాలు చేసి తీసికొని పత్రిక రెండుదినములకును, పుస్తకము పదిదినములకును తిరిగి భాండాగారమున చేర్చవలెను, ఒకదఫాకు ఒకగ్రంథము ఒకపత్రిక కంటె జాస్తీగా నియ్యఁబడదు. క్రొత్తగా వచ్చినపుస్తకములు 10 దినములవరకును పత్రికలు రెండుదినములవరకును సమాజమందిరమునుండి యియ్యకూడదు. పత్రికాసంపుటములు, నిఘంటువులు, సంవత్సరాదిసంచికలు భాండాగారమునుండి యితరుల కెప్పుడు నింటికియ్యకూడదు.

6 ట్రస్టుసంఘము-(1) ఈసమాజమునకుది12-3-1916

సం॥రం తేథిని వ్రాయబడి ఆమరుచటిదినముననే భీమవరం సబురిజస్ట్రారుగారివలన నెం 654 రు గా రిజస్టరు కాబడిన ట్రస్టుదస్తావేజులో నుదహరించిన ట్రస్టుసంఘము అయిదుగురులో నేకారణమువల్ల నైనను ఖాళీ కలిగినప్పుడు దానిలోని షరతులప్రకారము ట్రస్టీలు గా నేర్పడిన అయిదేండ్లకాల పరిమితిలోగా ఆఖాళీని సాధారణసంఘసభ్యులలోనుండి గాని కార్యనిర్వాహకసంఘమువారినుండి గాని తిరిగి పూర్తి చేసికొనవలసినది. అయిదేండ్లు దాటినపిమ్మట తిరిగి ట్రస్టీల నైదుగురిని పైనవ్రాసినవిధమున నెన్నిక చేసికొనుటకు సాధారణసంఘసభ్యులకుమాత్రమే అధికారము కలదు.

(2) సదరుట్రస్టీలుకూడి తమలోనొక్కరిని కార్యదర్శిగా నెన్నుకొనవలెను. వీరిఅయిదుగురిలో ముగ్గురుచేసిన తీర్మానప్రకారము వ్యవహారమంతయు జరుగుచుండవలెను.

(3) శ్రీవీరేశలింగకవిసమాజము, ప్రార్థనాసమాజము "కే. ఆర్. వి. కృష్ణారావుమందిరమున" జరుపుటకును వాటి యుద్దేశ్యము నెరవేర్చుటకును సదరు సమాజములకు సంబంధించిన ఆమందిరమును యితర స్థిరచరాస్తిన్నీ యింక సంపాదింపబోవు యావదాస్తిన్నీ యీసంఘమునకు ట్రస్టుగా సంక్రమించినది గనుక వారియధీనమున నుండవలసినది. ఈసమాజములపేరిట లేక సమాజములతరఫున వ్రాయబడేదస్తావేజు లన్నియు ట్రస్టీలసంఘకార్యదర్శిపేరున వ్రాయుచుండవలెను.

(4) ట్రస్టీలు యావదాస్తిని,మూలధనమును వృద్ధి చేయుచు కాపాడుచుండవలెను. సదరుసమాజములయొక్క ఆస్తిని లేక నగదును ఏసహకారపరపతిసంఘములోనయిన ను లేక యెవరికిగాని స్థిరాస్థిని ప్రథమతాకట్టుమీద నయినను బదులు ఇయ్యవచ్చును. ఈసొమ్ము ఒకచోటనుంచి మరి యొకచోటికి పయిరీతిని మార్చుట కీసంఘమున కధికారము కలిగియున్నది. ఈసంఘమువారుంచిన జమాఖర్చులెక్కలను ప్రతిడిశంబరునెలాఖరులోగా రిపోర్టుతో కార్యనిర్వాహకసం ఘమునకు తెలియజేయవలెను.

(5) ఈసంఘమువారు చేయు ప్రతివ్యవహారము పరిశీలించుటకు, ఆక్షేపించుటకు, ఆపుచేయుటకు కార్యనిర్వా హకసంఘమువారికి విచారణాధికారము కలదు. వారిపైన సాధారణసంఘసభ్యులు చేసేతీర్మానము ఆఖరుదిగా నుండ వలెను.

(6) లెక్కలు—శ్రీవీరేశలింగకవిసమాజమునకు ప్రార్థనాసమాజమునకు ట్రస్టుసంఘమునకు జమాఖర్చులెక్క లు వేరువేరుగా నుండవలెను. మొదట రెండుసమాజముల నిల్వసొమ్ము ట్రస్టుసంఘమువారి లెక్కలలో చేర్చబడవలెను. ఈమూటిలెక్కలు ఏకముఖముగా చేర్చి కార్యనిర్వాహక సంఘము తమసంఘములో చేరని యితరులవల్లగాని సాధారణ

శ్రీ వేమన గ్రంథాలయము,
తెలప్రోలు.

సంఘ మెంబర్లలో నెవరివల్ల నయినగాని సంవత్సరాంతము నకు పూర్వము తనిఖీచేయించి తనిఖీచేసినవారి రిపోర్టుసహిత ము తమ రిపోర్టుతో కార్యనిర్వాహకసంఘమువారు వార్షిక సభలో బహిరంగపరుచవలసినది.

7 సభలు—(1) ప్రార్థనాసమాజమును, శ్రీవీరేశలింగ కవిసమాజకార్యనిర్వాహకసంఘమును, అవసరము కలిగినప్పు డెల్లను కూడవచ్చును. సాధారణసంఘము అధమము రెండు మాసముల కొకసారి అయినను కూడుచుండవలయును. సంవ త్సరాంతపుసభ తప్పక జరుపుచుండవలయును.

(2) ఎవరైనను ముగ్గురు కార్యనిర్వాహకసంఘ సభ్యులు సభను కూర్పుమని దానిఅవసరమును దెలిపినచో సభాధ్యక్షుడుగాని, కార్యదర్శిగాని సభను తప్పక కూర్పవల యును. అట్లు వారముదినములలో సభను కూర్పనియెడల ఆముగ్గురును ప్రకటనచేసి సభను కూర్పవచ్చును.

(3) సభ జరుగునప్పుడెల్లను కార్యక్రమమును దెలుపుచు రెండుదినములకుపూర్వమే కార్యనిర్వాహకసంఘ ములోని ప్రతివానికి దెలియచేయవలెను. ప్రతిసభకును కార్య నిర్వాహకసభ్యులు అయిదుగురికి తక్కువకాకుండా చేరినం గాని సభ జరుగ గూడదు.

(4) సాధారణసంఘసభ్యులుఅయిదుగురుచేరి కార ణములువివరించి సభను గావింపుమని కోరినపక్షమున సాధా రణసభ కూర్పవలయును. ఆసభ కూర్చుటకు నాల్గుదినము

లకు ముందుగా విచారణాంశములతో సభికుల కందరికిని కార్యదర్శి తెలియజేయవలెను. అట్లు చేయనియెడల మరి నాల్గుదినములు గడచినపిమ్మట వారైదుగురును అందరికి తెలియ జేసి ఆసభను కూర్ప వచ్చును.

(5) సాధారణసభకు 9 గురు మెంబర్లు కూడినంగాని సభ జరుగ కూడదు.

(6) ప్రతిసంవత్సరము డిశంబరు నెలలో కార్యనిర్వాహకసంఘమువారు కూడి వార్షికసభ ఆనెలాఖరున గాని జనవరి నెల 15 వ తేదీలోగా గాని యేదోయొకదినమున జరుగుటకు కార్యక్రమము యేర్పాటులతో సభికులకును, అభిమానులకును, నితరులకును ఆహ్వానములు పంపుచుండవలెను.

(7) ఏకారణమువల్ల నయినను సభకు రా జాలని సభ్యులు ఆనాటి వార్షికసభలో చర్చింపబడు హంశములను గూర్చి గాని యెన్నికలనుగూర్చిగాని తమ యభిప్రాయమును ఫ్రాక్సీమూలముగా తెలియజేయ వచ్చును.

(8) ఏసభలోగాని హాజ రయిన మెంబర్లలో యెక్కువమంది అనుమతిప్రకారము తీర్మానములు జరుగుచుండవలెను. ప్రతిసభలో అధ్యక్షునకు అందరికంటె నొక వ్రోటు నిచ్చుటకు అధికారము కలిగియున్నది. సంవత్సరాంతముసభకు సమాజాభిమానముగల యేపెద్దమనిషినయినను కార్యని

ర్వాహకసంఘమువారు అధ్యక్షునిగా యేర్పరచుకొనవచ్చును.

8 కే. ఆర్, వి. కృష్ణారావుమందిరముయొక్క యుపయోగము.

(1) ఈమందిరమునశ్రీపీఠేశలింగకవిసమాజమును, ప్రార్థనాసమాజమును, ట్రస్టుసంఘమును వాటియావత్తురికార్డులు నిం దుండవలెను. సహకారపరపతిసంఘము రికార్డు కూడ నుండవచ్చును. వార్తాపత్రికాధిపఠనము జరుగుచుండవలెను. నీతి, భక్తి, వృద్ధిపొందులాగున నుపయోగకరములగు మత సాంఘిక, ఆర్థిక, రాజకీయాదిసభలును, నుపన్యాసములు వినోదకరము లగుప్రదర్శనములు, హరికథలు,భజనలు, ప్రసిద్ధ పురుషుల జీవితసంకీర్తనలు, మానసిక యేకేశ్వరోపాసనలు జరుగుచుండవలయును.

(2) ఇతరదేవాలయములవలెవి గ్రహారాధన యిం దుజరుగగూడదు. దీనిలో పెండ్లిబసలకు గాని బాటసారులకు గాని, చోటు నియ్యకూడదు. రాజశాసనవిరుద్ధమయిన యే సభలును నిందు జరుగకూడదు. చుట్టలు గాల్చుట, చీట్లాడుట, వేశ్యలచే గీత నృత్యములు చేయించుట వారికి బసగా నిచ్చుట నీతిబాహ్యము లగుప్రతిమలనుగాని, అట్టి గ్రంథములనుగాని యుంచుట, అట్టిప్రసంగములుచేయుట మొదలగునవి యిం దెంతమాత్రమును జరుగగూడదు.

(3) ఈమందిరమున జరుగకూడదని పైన వివరముగా నిషేధించినవిషయములలో గాక తక్కిన యేసభలుగాని, పైనివ్రాసినవాటిలో మరి దేనినిగాని జరుపుకొనుటకు ఆయా సందర్భములను బట్టి అనుజ్ఞనిచ్చుటకు లేక నిరాకరించుటకు ట్రస్టీల సంఘ కార్యదర్శికి అధికారము కలిగియున్నది.

9 (1) యీనిబంధనలలో 6 వ నిబంధనలో 1 వ క్లాజులో చెప్పిన ట్రస్టీదస్తావేజులో నున్ననిబంధనల ననుసరించి యీనిబంధనలు వ్రాయబడినవి. వీటిలో పొరపాటున వదలి పెట్టబడినపక్షమున ఆ ట్రస్టుదస్తావేజులోని నిబంధనలను బట్టి అమలు జరుగవలసినది.

(2) సమాజము పేరును మందిరము పేరును మార్చుటకు యెన్నటికి యెవరికినేవిధముగాను అధికారము లేదు. మరియు ట్రస్టుదస్తావేజులోని నిబంధనలుగాని యీనిబంధనలుగాని వేనినయిన పూర్తిగా గాని, కొంతవరకు గాని, రద్దుపరచుటకు, సవరించుటకు లేక మరియొకనిబంధన చేర్చుటకు, సాధారణసంఘసభ్యులకు పూర్ణాధికారము కలదు.

10 సభలు—ఏసభలు ఎప్పుడు జరిగినను వారు చేసినతీర్మానము లన్నిటిని గ్రంథస్థము చేయవలెను. ప్రతి సభలోను ఎక్కువమంది యిచ్చినఅభిప్రాయప్రకారము తీర్మానము కావలసినది. ట్రస్టుసంఘమునకు కార్యనిర్వా

హాకసంఘమునకు సాధారణసంఘమునకు నొకదాని కొకటి సంబంధము కలిగి క్రమముగా పైవిచారణచేయుటకు అధికారము కలిగియున్నది. సాధారణసంఘమువారు చేయు తీర్మానము ఆఖరుదిగానుండును. దానినిబట్టి అన్నిసంఘముల వ్యవహారములు జరుగుచుండవలెను.

ఈనిబంధనలు దివి 10-8-16 తేది గురువారముపగలు గం 3లుకు సమావేశమయిన సాధారణ సంఘసభ్యుల మీాటింగులో 3-వ తీర్మానము ప్రకారముస్థిరపరుపఁ బడినవి.

10—8—16 తారీఖు | భూపతిరాజుతిరుపతిరాజు.
కుముదవల్లి | కార్యదర్శి.

కార్యనిర్వాహకసంఘసభ్యులు.

1 సాగి వెంకటనరశింహరాజుగారు అధ్యక్షుడు.
2 భూ॥తిరుపతి రాజుగారు కార్యదర్శి.
3 సాగిసుబ్బరాజుగారు కోశాధిపతి.
4 భూ॥బాపిరాజుగారు భాండాగారకుడు.
5 భూ॥రామచంద్రరాజుగారు
6 భూ॥సోమరాజుగారు
7 సాగిచలపతిరాజుగారు — సభ్యులు
8 భూ॥సుబ్బరాజుగారు
9 భూ॥వెంకటనరశింహరాజుగారు

